# సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

# శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజి


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

# అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ


గురు రామకృష్ణ పరమహంస


అమ్మ శారదా దేవి


గురు వివేకానంద


గురు సాయిబాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళ స్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

# వందే గురుపరంపరాం..







"ఉచిత గురుకుల విద్య ఫౌండేషన్" ద్వారా విలువలు, నైపుణ్యాలతో కూడిన విద్య ఉచితంగా + సులభంగా + ఆకర్షణీయంగా + నాణ్యతతో కూడి అందించే సేవా కార్యక్రమంలో బాగంగా ఈ పుస్తకాన్ని సాధకుడు బ్లాగ్ నుంచి సేకరించి అందిస్తున్నాము. ఇందుకు మేము వారికి కృతజ్ఞత తెలియచేసుకుంటున్నాము.

సాయి రామ్ వారి సేవల విస్తరణలో బాగంగా ఈ ఫౌండేషన్ స్థాపించబడినది. దీనిద్వారానే అన్ని సేవలు అందించబడును. ఇటువంటి పుస్తకాలు మీరు వ్రాసినట్లయితే (లేక) సేకరిస్తే మాకు తెలియచేయండి. మేము ప్రతి విద్యార్ధికి ఉచితంగా అందేలా చేస్తాము, తద్వారా ఉన్నత విలువలు, నైపుణ్యాలు కలిగిన విద్యార్ధులను మన దేశానికి అందించవచ్చు. మాతో కలిసి నవ భారత నిర్మాణ కార్యక్రమంలో పనిచేయుటకు, భాగస్వామ్యం అగుటకు ఆసక్తి ఉంటే సంప్రదించగలరు.

ఈ గ్రంధాలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) సాధకుడు బ్లాగ్: https://sadhakudu.blogspot.in
2) ఉచిత గురుకుల విద్య ఫౌండేషన్ వెబ్ సైట్ : www.freegurukul.org
3) సాయి రామ్ వెబ్ సైట్ : https://sites.google.com/site/sairealattitudemanagement
4) మొబైల్ ఆప్: Free Gurukul

గమనిక: భక్తి,జ్ఞాన,ధర్మ ప్రచారార్ధం ఉచితంగా eBook రూపంలో సాధకుడు బ్లాగ్ సహాయంతో ఇవ్వడం జరిగింది. ఇది లాభార్జన దృష్టిలేని ఉచిత సేవ. ఈ సేవలో అంతర్జాలంలోని(ఇంటర్నెట్) లైసెన్సు / కాపీరైటు అభ్యంతరాలు లేనివి అనుకొన్న పుస్తకాలను గ్రహించటం జరిగినది. అనుకోకుండా ఏవైనా అభ్యంతరకరమైనవి ఉన్నచో మాకు తెలుప మనవి, వాటిని తొలగించగలము అని మనవి చేసుకొంటున్నాము

Website: www.freegurukul.org Mobile App: Free Gurukul email: support@freegurukul.org
Facebook: www.facebook.com/freegurukul Helpline/WhatsApp: 9042020123

" మన లక్ష్యం: విలువలు, నైపుణ్యాలతో కూడిన విద్య అనేది ఉచితంగా + సులభంగా + ఆకర్షణీయంగా + నాణ్యతతో కూడి అందరికి అందించబడాలి "

ఉచిత గురుకుల విద్య ఫౌండేషన్ – Free Gurukul Education Foundation

సర్వం పరమాత్మ పాద సమర్పణమస్తు

# కర్మ సిద్ధాంతము

దివ్యాత్మ స్వరూపులందరికీ నా నమస్కారాలు.

**యత్ర యోగీశ్వరః కృష్ణో యత్ర పార్థో ధనుర్ధరః**
**తత్ర శ్రీః విజయోర్భూతిః ధ్రువా నీతిర్మతిర్మమః ॥**

నాకు ఇవ్వబడినటువంటి అంశము 'కర్మ సిద్ధాంతము' ఇది అందరికి బాగా తెలుసు. కాబట్టి నేను పెద్దగా కష్టపడక్కర్లేదు. కర్మ సిద్ధాంతము గూర్చి మాట్లాడాలి అంటే, చాలా సమయం కావాలి, ఇచ్చిన సమయం 30 నిమిషాలు. సరే, కొద్దిగా పరిచయం చేసే ప్రయత్నం చేస్తాను. మీ మీ బుద్ధి అనుసరించి, మీ శక్త్యానుసారము గ్రహించి, పెద్దలున్న సభ కాబట్టి, తప్పులుంటే మన్నించండి.

కర్మ అంటే, "కర్మమున బుట్టు జంతువు". మొదటి సూత్రము ఏంటంటే, కర్మమున బుట్టు జంతువు. (మనం) సృష్టిలో మనం కూడా భాగమే కాబట్టి, జీవితం మొత్తంమీద ఎప్పుడైనా సరే, 'ఇది నా కర్మ' అని మీరు అనుకున్నారనుకోండి, అప్పుడు మనిషి స్థాయి నుంచి జంతువు స్థాయికి పడిపోయామని గుర్తు. కాబట్టి మనిషి ఎప్పుడూ కూడా 'ఇది నా కర్మ' అని అనుకోనవసరం లేదు. ఒక్క మనిషికే ఈ అవకాశం. ఎందుకని? మిగిలినవన్నీ జంతువులే కాబట్టి. అవి జంతువులుగానే జీవిస్తాయి కాబట్టి. జంతువులుగా జీవించకుండా వుండే అవకాశం ఒక్క మనిషికే వుంది కాబట్టి. కాబట్టి పుట్టింది మొదలు, పోయే లోపల ఏదన్నా జరగని, జరుగక పోనీ, వాటన్నింటికీ కూడా మనం అపరిష్కృతమైనటువంటి, అంటే పరిష్కారం లేనటువంటి లేదా మనకి తోచనటువంటి, ఏం చెయ్యాలో తెలియనటువంటి, Blind అంటే ఒక గుడ్డి పరిస్థితిలోనికి వెళ్ళి పోయినప్పుడు, "ఇహ మన చేతిలో ఏం లేదురా బాబు, చేయవలిసిన వన్నీ చేసేశాం, ఇహ మనం చేయగలిగినది ఏమీ లేదు". ఇక ఫలితమా? ఇప్పుడు మనం అనుకున్నది వస్తుందో రాదో కూడా, ఆశావాహం అవుతుందో కాదో కూడా, ఆశించడానికి కావల్సిన ధైర్యం కూడా కోల్పోతాము.

ఈ (ధైర్యం) కోల్పోయిన దశలో మనకు గుర్తువచ్చేవాళ్ళు ఎవరయ్యా అని అంటే,

**"లావొక్కింతయు లేదు ధైర్యము విలోలంబయ్యే. . ."**

ఇహ నాకు శక్తి లేదు నాయనా! నువ్వు చేయాల్సిందే. నా వల్ల అయితే కాదు. సరే, భగవంతుడి దయవల్లో, కాలం అనుకూలించడం వల్లో, మన ప్రయత్న ఫలమో, ఈ మూడూ కలిస్తే ఫలితం వస్తుంది. ఎప్పుడైనా ఇది గుర్తు పెట్టుకోవాలి.

1. భగవంతుడి దయ వుండాలి.
2. కాలం అనుకూలించాలి.
3. నీ ప్రయత్నం వుండాలి.

ఫలితం రాలేదు అని అంటే, ఈ మూడిటిలో ఎక్కడో ఒక చోట తేడా వుంది.

ఇది చాలా ముఖ్యము.

"నేను బాగా చదివానండి, బాగా పరీక్ష రాశానండి, వంద కి వంద రావాల్సిందే నండి. 991/2 వచ్చినాయండి. అర మార్కు పోయిందండి, ఎందుకు పోయిందో నాకు తెలియదండి" అని చింతించే విద్యార్థి అయినా,

"బాగా ఉద్యోగము చేశానండి, బాసు మాత్రం నన్ను రోజూ తిడుతూనే వుంటాడండి" అనేటటువంటి ఉద్యోగి అయినా,

"మా ఆవిడని నేను బాగానే చూసుకునే ప్రయత్నం చేస్తూనే వుంటానండి, కాకపోతే ఆవెడ ఎప్పుడూ రోజూ నన్ను అంటూనే వుంటుందండి, విమర్శిస్తూనే వుంటుందండి" అనేటటువంటి భర్త లైనా,

ఇక ఏ రకమైన దుఃఖానికి, ఏ రకమైన కారణాలు చెప్పుకునే వాళ్ళు ఎవరైనా సరే, అంటే అనంత దుఃఖాలు మనకు వున్నాయి. ప్రతి ఒక్కరినీ కదిలిస్తే, సుఖాల కంటే, దుఃఖాల గురించి బాగా ఉపన్యాసం చెబుతాం.

ఆ దుఃఖ సమూహానికి అంతటికీ కారణం ఎవరయ్యా?

మన ప్రయత్నమా?

కాలమా?

భగవంతుడా?

ఎందుకని?

కర్మ అంటే ఏమిటయ్యా అని అంటే, జననం నుంచి మరణం దాకా అన్నీ కర్మే! ఇంకా 'ఫలానాది కర్మ అవుతుంది. ఫలానాది కాదు' అని చెప్పడానికి వేరే ఏమీ లేదు. అన్నీ కర్మే. కాబట్టి మనం కొద్దిగా ఆలోచిస్తే, ప్రతి ఒక్కరికీ తెలిసినటువంటి గీతా వాక్యము ఏమిటంటే,

**కర్మణ్యేవాధికారస్తే, మాఫలేషు కదాచన,**
**మా కర్మ ఫల హేతుర్భూః, మాతే సంగోత్స్వకర్మణి –** (స్వ కర్మణి).

"సంగము– స్వకర్మ". ఆ ముగింపులో వుందండి మెలిక అంతా కూడా. కాబట్టి 'అశక్తత, ఆసక్తత' ఈ రెండూ జీవితంలో, రెండు బలమైన శక్తులు. 'ఆసక్తి' ఎంత బలంగా వుంటుందో, దాని వెనుకాలే 'అశక్తత' కూడా వుంటుంది. కాబట్టి, మనం ఎప్పెడెప్పుడైతే 'ఆసక్తత'కి తగులుకుంటామో, ఎక్కడో ఒకచోట దానిని మనం, 'అశక్తత' రూపంలో కూడా దానిని అనుభవించ వలసిన అవసరం తప్పనిసరిగా వుంటుంది. ఇది జీవన సత్యం.

సరే, "ఏమండీ! ఇది అందరికీ తెలిసిందే కదా! అందరం పుట్టాల్సిందే, అందరం ఎక్కడో ఒక చోట చదువుకోవాల్సిందే, ఎలాగోలా అన్నం తినాల్సిందే, నిద్రపోవాల్సిందే, ఏదో ఒక పనులు చేయాల్సిందే, ఆయా ఆసక్తతలను అనుసరించి, ఒకరు మాస్టారు కావచ్చు, ఒకరు డాక్టరు కావచ్చు. ఒకరు యాక్టరు కావచ్చు లేదూ మరోకరు వ్యవసాయదారులు కావచ్చు, వృత్తులు భేదంగా వుండవచ్చు, సరే గానీ, ఇవన్నీ ఎలా చేస్తే, ఏమైనా తేలుతుందా ఇది? (ఏమైనా). ఇది ఎప్పటికీ ఇంతే వుంటుంది అంటే తెలుసుకోవడం ఎందుకు?"

చాలామంది వేదాంతంలో ప్రవేశించిన తరువాత, మొట్టమొదట బాగా తెలుసుకునేది ఏమిటంటే మనం చేయగలిగినది ఏమీ లేదు అనేది.

"అదేమిటండీ! మనమే కదా అంతా చేయవలసినది, "**సాధనమున పనులు సమకూరు ధరలోన**" అని కదా! చిన్నప్పటి నుంచి మనకు నేర్పింది. అసలు ప్రయత్నం చేయకుండా ఏదీ రాదు కదా! ప్రయత్నం లేకపోతే కాలం అనుకూలిస్తుందా?"

అంటే ప్రయత్నం చేయడానికి, కాలం అనుకూలించడానికి మధ్య సంబంధము లేదు.

అర్జునుడి గారి దగ్గర బాణాలు వున్నాయి కదా అని, ఎప్పుడు పడితే అప్పుడు యుద్ధం చేస్తానంటే, యుద్ధం ఫలించేదా?

అది ఫలించదు.

పరమాత్మ సంకల్పించినప్పుడు, ఆ కాలం అనుకూలిస్తుంది.

అంటే పరమాత్మ చేతిలో కాలం వుంది కానీ, మన చేతిలో లేదు.

కాబట్టి మన ప్రయత్నం దేని కోసం?

కాలం ఎప్పుడు అనుకూలిస్తుందో తెలుసుకోవడం కోసం.

పరమాత్మ స్థితిని తెలుసుకునే ప్రయత్నం చేయడం, ఈ ప్రయత్నం రెండు రకాలన్నమాట.

1. కాలం ఎప్పుడు అనుకూలిస్తుందో తెలుసుకోవాలి. అలాగే ఏం చేయాలి?

2. ప్రయత్నం 'పరమాత్మ స్థితి'ని తెలుసుకోవడానికి కూడా ఉపయోగపడుతుంది.

ఎలా?

**యోగస్థః కురు కర్మాణి, సంగం త్యక్త్వా ధనుంజయ**
**సిద్ధ్యసిద్ధ్యో సమో భూత్వా సమత్వం యోగముచ్యతే**

ఈ చేసే పనుల్నే, ఈ కర్మనే, ఎంతకీ అర్థం కానటువంటి, నుదురు కొట్టుకొనేటటువంటి కర్మే, యోగ దృష్టితో కనుక చేసినట్లయితే, ఈ ప్రయత్నాన్నే యోగ దృష్టితో కనుక చేసినట్లయితే, ఇది సాధ్యమే. ఇది సాంఖ్య యోగంలో చెప్పినటువంటి రెండు ప్రధానమైనటువంటి సూత్రాలు. సరే! 'యోగస్థః కురు కర్మాణి' చేస్తే వచ్చే ఫలితం అందులోనే చెప్పేశాడు. 'సమత్వం యోగముచ్యతే' ఇవాళ మనమేదో రకరకాల సామాజిక సిద్ధాంతాలలో మాట్లాడుకున్నటువంటి, సమత్వం, సమానత్వం ఇతరత్రా వగైరాలన్నీ నిజానికి మాట్లాడితే, శరీరం పరిధిలో చూస్తే, డాక్టరు గారు, స్త్రీ అయినా పురుషుడైనా ఆయా శరీరాన్ని బట్టి వైద్యం చేస్తాడు.

స్త్రీలకు చేసే వైద్యం పురుషులకు పనికిరాదు, పురుషులకు చేసే వైద్యం స్త్రీలకు పనికిరాదు. కొన్ని అంశాలలో. సామాన్య అంశాలలో ఇద్దరికీ treatment ఒక్కటే.

సరే, కాసేపు మానసిక వైద్యుడి దగ్గరకు వెళ్ళాం అనుకుందాము.

ఇప్పుడు స్త్రీకి, పురుషుడికి కూడా వేరే వైద్యం వుంటుందా?

మనో పరిధిలోకి వెళ్ళేటప్పటికి, ఈ స్త్రీ, పురుషులు పోయింది.

అంటే సమత్వం ఎక్కడినుంచి మొదలౌతోంది?

మనసు దగ్గర నుంచే మొదలైపోతోంది. కాబట్టి ఇప్పుడు మనం అందరం ఆలోచిస్తున్నామంటే మనలో మనసు వున్నట్లేగా. కాబట్టి, సమత్వం ఎక్కడ మనం ఇప్పుడు ఏ స్థాయి నుంచి మనం మాట్లాడుకోవాలి ఎప్పుడూకూడా?

నేను ఎవర్నయ్యా అంటే, నేను యాక్టర్‌ని, డాక్టర్‌ని అన్నా కూడా, ఆ యాక్టరు, డాక్టరు మనస్సే. శరీరానికి వచ్చేటప్పటికి యాక్టరు, డాక్టరు తేడా లేదు. కాబట్టి "యోగస్థః కురు కర్మాణి" చేసే పనిని సరైన లక్ష్యాన్ని పెట్టుకుని, ఆ సమత్వం అనే లక్షణాన్ని గనుక పోషించే పద్ధతిగా గనుక చేసినట్లయితే, నీ ఆసక్తే 'అశక్తత' అనే స్థితి రాకుండా నువ్వు దాన్ని సాధించు.

మొదట ఏం చెప్పానండి?

'ఆసక్తి' అనేది వుంటే, జీవనంలో ఏదో ఒక దశలో అదే అంశంలో 'అశక్తత' చేత బాధించబడక తప్పదు. కాబట్టి అదే ఆసక్తిని, "సమత్వం యోగముచ్యతే" అనే లక్షణంతో గనుక మనం జీవించినట్లయితే, అశక్తత చేత బాధించబడేటటువంటి అవసరాన్ని మనం దాటవేయవచ్చు. అధిగమించవచ్చు. ఇక ఏమండీ! మనల్ని మనం తక్కువ చేసుకోవాల్సిన అవసరం లేదు, సృష్టిలో ఉన్నతమైన జీవులు ఎవరైనా వున్నారంటే, మనిషే! ఎన్నో చదువుకున్నాము. ఎన్నో సాధించాము. ఎంతో చేశాము, ఎన్నో సాధించాము అనుకునేటటువంటి జ్ఞాపకాల సమూహము, బరువు టన్నులు, టన్నులు మనమీద వుంది. ఎవర్ని కదిల్చినా చెబుతారు. అందులో ఏం పెద్ద విషయం లేదు. మీరు LKG పిల్లవాడిని కదిల్చినా కూడా బోల్డు Rhymes చెప్తాడు. మనం కూడా అలాగ చాలా

నేర్చుకుని, చాలా తెలుసుకుని, చాలా పనులు చేసి, ఆయా ఫలితాలను బేరీజు వేసుకుంటూ, విశ్లేషణాత్మక శక్తినంతా మన నెత్తిమీద మోస్తూ, దాని గురించి చెబుతాం. అయితే భగవానుడు ఈ అంశంలో కర్మయోగంలో చెబుతున్నటువంటి సూత్రం ఏమిటంటే,

**బుద్ధి యుక్తో జహాతీహ ఉభే సుకృత దుష్కృతే**
**తస్మాత్ యోగాయ యుజ్యస్వ యోగస్తు కర్మసుకౌశలం**

మీరంతా చేశాము, చేశాము, చెయ్యాలి, చెయ్యాలి. మనలో బాగా పనిచేసేవి రెండే నండి. 'కర్మ' అంటే నాకు తెలిసి చెప్పాలి అంటే, బాగా చేశాము, చేశాము, చేశాము. మన నెత్తి మీద ఒక బరువు వుంటుంది. పొద్దున లేస్తూనే మనతో ఏం పని చేస్తాయండీ? బాగా చేశాము, చేశాము, చేశాము. మన వెనుకాల వున్నటువంటి బరువు. అది మన బలం. ఇంకా చెయ్యాలి, చెయ్యాలి, చెయ్యాలి. అది. ఇంతే. పొద్దున లేస్తూనే ఇదే.

గాఢ నిద్రావస్థలో 'చేశాం, చేశాం, చేశాం' అనేది ఎక్కడికి పోయిందో తెలియదు. 'చెయ్యాలి, చెయ్యాలి, చెయ్యాలి' అనేది ఎక్కడి పోయిందో తెలియదు. మరి రోజూ అదే నిద్రావస్థలోకి వెళ్తూనే వున్నాము. మరి ఈ 'చెయ్యాలి, చెయ్యాలి, చెయ్యాలి' అనేవాడు ఎక్కడికి పోయాడో తెలియదు. 'చేశాము, చేశాము, చేశాము' అంటున్నవాడు ఎక్కడికి పోయాడో వాడు అంతకంటే తెలియదు. మరి, వీడి గురించి మాత్రం మనం పట్టించుకోవడం లేదు. ఎంత సేపు వీళ్ళ ఇద్దరి గురించే పట్టించుకుంటున్నాము. కాబట్టి ఆయన ఏమంటున్నారంటే, ఎటువంటి మానవుడైనా సరే, జీవి అయినా సరే, మెలకువా, నిద్రా, కల తప్పవు కదా!

మరి ఈ మెలకువ, కల, నిద్రలలో జీవితం అంతా చేశాం కదా! ఏమైనా నైపుణ్యం వచ్చిందా మనకి?

అంటే ఎలా మేలుకుంటే, అది యోగపద్ధతిగా మేల్కోవడం అవుతుంది?

ఎలా కలకంటే, అది యోగపద్ధతిగా కలకనడం అవుతుంది?

ఎలా నిద్రపోతే, అది యోగపద్ధతిగా నిద్రపోవడం అవుతుంది?

ఎందుకని? యోగం అన్నదానిని అన్నింటికి చేర్చమని భగవద్గీత బోధిస్తోంది?

18 యోగాల పద్ధతిలో చెప్పేశాడు ఆయన. నువ్వు ఎటున్నా తిరగాలి, అందులో తిరుగవలసిందే. మనిషన్నవాడు ఏదైనా చేయ్యని,

తినని – అది కూడా యోగమే.

పని చేయని – అది కూడా యోగమే.

నిద్ర పోనీ – అది కూడా యోగమే అయివుండాలి.

అప్పుడే 'కర్మమున బుట్టు జంతువు' అన్న సూత్రాన్ని మనం దాటుతాం. బాగా గుర్తుపెట్టుకోవాలండి. దుఃఖం నుంచి మనం బయటపడాలి అని అంటే, 'కర్మమును బుట్టు జంతువు' అన్న సూత్రము మీద ఆధారపడి వున్నంత వరకూ, మనతో పాటు మన నీళ్ళ కుండ, నెత్తిమీద ఎప్పుడూ వుంటుంది. ఇహ దాన్ని ఎవరూ తప్పించలేరు. మీరు కాళ్ళా పడండి, వేళ్ళా పడండి. ఎవరి దగ్గరకు వెళ్ళండి, ఏడుకొండలకు ఎన్ని సార్లైనా వెళ్ళండి. అర్థమైందా అండీ!

**దుఃఖం పోగొట్టుకోవాలి అంటే ఒకే ఒక్క సూత్రం. యోగాన్ని ఆశ్రయించాలి**. వేరే మార్గం లేదు. 'యోగం' అంటే ఏదో ఆసనాలు, గుంజీల్లు కావు. అర్థమైందా అండీ! లేదంటే, (అదేమిటి) చక్కెర వ్యాధి, ఉప్పువ్యాధి పోగొట్టుకునేది అంతకంటే కాదు. శరీరానికి వచ్చిన ఏదో కాసేపు తాత్కాలికమైనటువంటి జ్వరాన్ని పోగొట్టుకోవడానికో, లేకపోతే కీళ్ళ నొప్పులు పోగొట్టుకోవడానికో వాటికి ఉపయోగపడేది కావు.

నిజానికి అసలు 'యోగం'వల్ల మనిషికి ఉపయోగం ఏమిటయ్యా? అని అంటే,

**"కర్మజం బుద్ధి యుక్తాని ఫలం త్యక్త్వా మనీషిణః"**

మనమందరం మనుషులం. యోగ దృష్టి వల్ల జీవిస్తే, ఏమౌతాము?

"మనీషిణః" – మహాత్ముడు అవుతారు.

మనం ప్రత్యేకంగా ఏమీ ఆది శంకరాచార్యులుగానో, అరవింద మహర్షిగానో, భగవాన్ రమణులుగానో, స్వామి వివేకానంద గానో, రామకృష్ణపరమహంసగానో ఇలాంటి కారణ జన్ముల పేర్లు మనందరికి చాలా బాగా తెలుసు.

అలాంటి కారణ జన్ములుగా పుడితేనే, మనం 'మనీషులుమా'?

కాదు.

ప్రతి ఒక్క మనిషికి 'మనీషి'గా జీవించేటటువంటి అవకాశం, అధికారిత్వం వున్నది. అని భగవద్గీత ఇచ్చినటువంటి గొప్ప వాగ్దానం. ఈ కర్మయోగమనే అధ్యాయం. మనం అందరం చేసే పనిని "కర్మజం బుద్ధి యుక్తా" – "బుద్ధి కర్మాణు సారిణి" – ఇటు తిప్పి రాస్తే. వేరే ఏమీ లేదు.

నీ 'బుద్ధి' ఎట్లా పని చేస్తుందయ్యా?

నీ 'కర్మ' ఎట్లా వుంటే, నీ బుద్ధి అట్లా పని చేస్తుంది. అంటే,

నీ 'స్వభావం' అనేది ఏదైతే వుందో, అది ఆ కర్మ అనే విత్తనం.

సరే నండీ! ఇలా మనీషిగా అంటే, యోగ దృష్టితో లేక జ్ఞాన దృష్టితో లేక పరమాత్మని తెలుసుకోవడానికనే లక్ష్యంతో చేస్తే ఏమిటి ప్రయోజనం?

ఏమైనా నేను తినలేనివి ఏమైనా తినగలిగే అవకాశం వుందా?

చూడలేనివి అన్నీ చూడగలిగే అవకాశం వుందా?

అనుభవించ లేనివన్నీ అనుభవించే అవకాశం వుందా?

బాగా సుఖం పెరుగుతుందా?

దుఃఖం తగ్గుతుందా?

నిద్ర బాగా పడుతుందా?

రోగం రాకుండా వుంటుందా?

ఇవన్నీ ఏమీ ఆ వాగ్దానంలో లేవు.

"**జన్మ బంధ వినిర్ముక్తా**" నీకు ఒక్కటే ప్రయోజనమయ్యా! ఎవ్వరూనా ఏదైనా ప్రయోజనం వుందా అంటే, ఒక్కటే ప్రయోజనం వుంది. ఏమిటి? అంటే,

కొద్దిగా "జనన మరణ రహస్యం" నీకు తెలుస్తుంది. అది తెలిస్తే "కర్మ రహస్యం" విడిపోయినట్లే.

'జనన మరణ రహస్యం' తెలుసుకోవడం కోసమే మనం (కర్మని) 'కర్మ' అనే పేరుతో జీవనాన్ని ఆచరిస్తున్నాము. 'జనన మరణ రహస్యం' తెలియలేదనుకోండి,

'జనన మరణ రహస్యం' అంటే శరీరం ఎట్లా పుడుతుందో చెప్పే అంశం కాదు సమీ!

"బుద్ధి కర్మాను సారిణి" అనేటటువంటి సూత్రం వెనుకాల వున్నటువంటి రహస్యాన్ని తెలుసుకోమని చెప్తారు. సరే, 'కర్మయోగం' అనేటటువంటి అధ్యాయంలో, స్థూలంగా మనం సంక్షిప్తంగా మాట్లాడే అవకాశం ఇచ్చారు కాబట్టి,

1 నుంచి 8 శ్లోకాలలో

"అనాసక్తి భావంతో నియమిత కర్మని ఆచరించడం" ఎట్లాగో చెప్పారు.

9 నుంచి 16 శ్లోకాలలో....

"ఫలాపేక్ష లేక చేయబడే కర్మ, అది యజ్ఞభావంతో ఎట్లా చేయబడుతున్నదో" చెప్పారు.

ఇక 17 నుంచి 24 లోపల....

"జ్ఞాని, భగవంతుడు లోక కల్యాణార్థం కర్మలు ఎలా చేశారో, చేస్తారో, ఒక జ్ఞాని ఎలా జీవిస్తాడు? ఒక పరమాత్మ ఎలా జీవిస్తాడు?" చెప్పారు.

ఇందాక వారు అన్నారు, 'భాగవతం' చెప్పేటప్పుడు. "లీల". వాస్తవానికి ఎన్ని గ్రంథాలు తిరగేసినా, 'లీల' అని అంటే అర్థం వుండదండి. అర్థం లేని పదం అన్నమాట. ఎందుకు అలా వేస్తారు అని అంటే, ఒక్కొక్కప్పుడు

"**కర్మఫలాన్ని, కర్తృత్వాన్ని రెండింటినీ పోగొట్టే పద్ధతిగా చేసే దానికి లీల**" అని పేరు. కాబట్టి అలాంటి అంశాలన్నీ కూడాను, అక్కడ చర్చించారు. ఇక 'అజ్ఞాని, జ్ఞాని' వీటి వివరణ కూడా కర్మయోగంలోనే చెప్పేశారు. సరే,

ఇక మనం అందరం బాగా బాధించబడే అంశం ఏదయ్యా? అని అంటే,

ఏదో ఒకటి కావాలి అనుకోవడం, కోరిక. కామం. అంతే కదండీ!

కోరిక లేని వారు ఎవరైనా వున్నారా?

ఈ సభాసదులలో కోరిక లేని వారు ఎవరైనా వున్నారా? అని ప్రశ్న ఎవరికి వాళ్ళు వేసుకోవాలి. నేను అడగడం కాకుండా.

కోరిక లేదు అన్నారనుకోండి,

మనమందరం ఏ స్థితిలో వున్నట్లు?

బుద్ధుడు. నిర్వాణ స్థితిలో వున్నట్లే.

కోర్కె లేదు అంటే, నిర్వాణ ప్రజ్ఞ. దాని పేరే 'నిర్వాణ ప్రజ్ఞ' అండీ!

మనందరికీ గాఢ నిద్రావస్థలో అసలు ఏమన్నా కోరిక వుందా?

ఏ కోరికైనా మన గాఢ నిద్రావస్థలో వుందా?
లేదు కదా! కలలో గాని, మెలకువలో గానీ మాత్రమే, మనస్సు పని చేస్తున్నప్పుడు మాత్రమే, ఈ గోలంతా వచ్చింది. మరి అటువంటప్పుడు మనం ఎలా....
ఇందాక వారు ఎవరో అడిగారు.
"మాయని దాటడం ఎలా?" మంచి ప్రశ్నే. అసలు మాయ అంటే, "యామాసా మాయ". 'ఏది లేదో అది'. అంటే ఇప్పుడు మనం లేని దానిని పట్టుకుని వున్నది అనుకుంటున్నాం అట. అని చెబుతున్నారు వేదాంత శాస్త్రంలో. **ఏది లేదో, ఏది వుందో చెప్పడం వివేకం**.
వివేకం అంటే వేరే గొప్పసూత్రాలు ఏమీ లేవండి. దానికి ఎన్ని పేర్లన్నా పెట్టుకోండి.
వివేకం అంటే ఏమిటంటే?
"ఏది లేదు?, ఏది వుంది?". That's all.
**స్థిరంగా, స్పష్టంగా వస్తునిశ్చయంగా 'ఇది లేదు, ఇది వుంది' అని చెప్పగలగడం వివేకం**.

కర్మని ఆచరిస్తే ఏమిటి వస్తుందయ్యా?
ఇందాకే చెప్పాడు. 'మనిషి మనీషి అవ్వచ్చు'.

'మనీషి' అయితే ఏమిటి ప్రయోజనం?
'వివేకం'తో వుండవచ్చు.

'వివేకం' వల్ల ఏమిటి ప్రయోజనం?
'ఏది వుందో, ఏది లేదో' స్పష్టంగా తెలుస్తుంది.

నాకు ఇప్పుడు కూడా తెలుసుకదండీ!
ఎక్కడి వరకూ తెలుసు మనకి?
'శరీరం' వుందా లేదా? తెలుసు.
'ప్రాణం' వుందా లేదా? అది కూడా తెలుసు.
'మనస్సు' వుందా లేదా? తెలుసు అనే చెప్పాలి.

'బుద్ధి' వుందా లేదా?

వుంది కాబట్టే కదా ఇక్కడికి వచ్చాము. అంతే కదండీ!

కాబట్టి ఇంకా అవతలికి వెళ్ళి మాట్లాడితే....

ఇప్పుడు 'ఆత్మ' వుందా? లేదా?

ఏమోనండీ! కొద్దిగా ఆలోచించి చెప్పాల్సిందే.

అందరూ పెద్దలందరూ వుంది అంటున్నారు కాబట్టి వుంది అని చెప్పవలసిందే.

లేదూ, స్వానుభవంలో నిర్ణయమై వుంటే, స్పష్టంగా ఆత్మానుభవం ద్వారా ఇది వున్నది.

ఇంతకీ ఈ గోల అంతా ఎందుకు వచ్చిందయ్యా అని అంటే,

ఆ బుద్ధి లోనే వుందట. 'బుద్ధి కర్మాను సారిణి' కదా!

ఆ 'కర్మ' ప్రభావం, ఇందాక వారు అన్నారు. 'చలాచలబోధ'లో....

ఏది? 'మూడు గుణాలు' వాటి విషయం అంతా.

ఆ మూడు గుణాల వల్ల మనకు ఏం జరుగుతోంది అసలు? అంటే,

'భేద బుద్ధి' ఏర్పడింది. ఇంకేమీ లేదు.

ఆ రెండూ ఒకటిగా వుంటే, ఆ రెండింటినీ వేరువేరుగా వున్నాయి, అని తోపింపజేయడమే మూడుగుణాలు అంటే. ఇంకేమీ లేదు.

ఇక్కడున్న గోపీకృష్ణగారు, వారిని follow అయ్యేవారు అంతా ఒక్కటే. అన్నారు అనుకోండి. Telugubhakthipages.com వల్ల వారంతా ఒక్కటే అని అనడం కాదు అక్కడ అర్థం. చైతన్యంగా చూస్తే మనమంతా ఒక్కటే. మీరు, మేము అన్నారు ఏమిటో, 'మీరు, మేము' అన్ని పదాలు లేవు అసలు అక్కడ. వున్నది ఒక్కటే, చైతన్యమే. అన్నదగ్గరే మనస్సు ఆగిపోవాలట.

"ఉన్నది ఒక్కటే, చైతన్యమే, ఆత్మే" అనే దగ్గర మనస్సు ఎప్పుడైతే ఆగిపోయిందో, 'భేద బుద్ధి' లేదు.

ఎందుకని చెబుతున్నారట?

ఆ భేద బుద్ధి వల్లనే మనం అందరం అజ్ఞాన యుతంగా ఆలోచించేటటువంటి జీవనాన్ని కలిగివున్నాము. వేరే ఇంతకు మించి ఏమీ లేదు.

ఈ భేదబుద్ధిని పోగొట్టుకోవడం కోసం చేసే ప్రయత్నాలే, నవవిధ భక్తి మార్గాలు గానీ, యోగ సాధనలు గానీ ఎన్ని పేర్లన్నా చెప్పుకోండి. అవన్నీ కూడా మనకు అర్థం అవ్వడం కోసం చెప్పిన పద్ధతులు. మన ఇష్టాన్ని బట్టి, మన శక్తిని బట్టి, మనకు ఏది చేస్తే బాగుంటుంది అని మనం అనుకుంటామో, ఆ బాగుంది అనే సూత్రాన్ని బట్టి నడపడం కోసమని పాపం శాస్త్రం ఇంత పెద్దగా తయారైపోయింది. ఇప్పుడు ఆ శాస్త్రాన్ని చూసి మనమే భయపడిపోయి దూరంగా పారిపోతున్నామేమో అనేటటువంటి అనుమానం కూడా కలుగుతోంది. పెద్దలు అందరూ కూడా పూర్వం ఏం చేసేవాళ్ళు అంటేనండీ, దీన్ని సాంప్రదాయక విద్యా విధానంలో...

నాకు 45 ఏళ్ళు అండీ! నాకు బాల్యం నుంచి సాంప్రదాయక విద్యావిధానమే అలవాటు. మమ్మల్ని ఏనాడూ కూడా ఇన్ని గంటల సేపు కూర్చోమనిగానీ, లేదంటే, ఇన్ని సంవత్సరాల పాటు అది చదువుకుని రమ్మనిగానీ, లేకపోతే ఈ పాఠం అప్పజెప్పమని కానీ అలా మాకు ఎప్పుడూ ఎవరూ చెప్పలేదు. వెళితే వాళ్ళకు తెలిసిన... పెద్దలు ఏదన్నా వాళ్ళ జీవితంలో ఆచరించి చూపెడుతున్న అంశము ఏద్దైనా వుంటే, మా జీవనాన్ని చూసి నువ్వు ఏం తెలుసుకున్నావు? అని ఉల్టా మళ్ళీ నన్నే ప్రశ్న వేసేవాళ్ళు. అంటే మనం వారి జీవనాన్ని గురించి మనం తెలుసుకోవాలి అనంటే వారితో కలిసి జీవించాలి కదా! ఉండాలి కదా వారి దగ్గర. అట్లా వారితో కలిసి జీవించి అధ్యయనం చేసేటటువంటి గురుశిష్య సాంప్రదాయక పద్ధతే సరైన మార్గం. అందుకే తల్లి, తండ్రి, గురువు మనతోపాటే వుండాలి. మనం వాళ్ళ జీవన విధానం నుంచి నేర్చుకోవాలి అనే భారతీయ సంస్కృతి, సాంప్రదాయంలో మనం అందరం పుట్టటానికి, మనం ధన్యత చెందడానికి మంచి అవకాశం.

సరే, "**ఉత్తమం తత్వ చింతాచ**" ఏమండీ! ఈ కర్మ ప్రభావంలోనుంచీ బయట పడాలన్నా, తెలుసుకోవాలన్నా, ఏదన్నా చేయాలన్నా, ఏం చేయవచ్చండి?

మనసన్నా, మాయన్నా, ఎఱుకన్నా ఊరికే స్థితి భేదాన్ని బట్టి పెట్టిన పేర్లు. మనసన్నా, మాయన్నా, ఎఱుకన్నా అన్నీ ఒకటే. 'కర్మ'న్నా కూడా అదే. ఎందుకంటే మనసు అంటున్నామంటే, ఇక అన్నీ అదే అన్నమాట ఇక. ఇంకా వేరే ఏమీ లేదు.

ఏం చేయవచ్చండీ?

"ఉత్తమం తత్త్వ చింతాచ" – నేను ఉత్తమ సాధకుడినండీ! No Problem. అయితే తత్త్వ చింతన చేయి. "మధ్యమం మంత్ర చింతాచ" – నాకు అంత కెపాసిటీ లేదండి. గురువుగారు 'తత్త్వమసి' అని ఒక వాక్యం చెప్పేస్తే, నాకు బ్రహ్మానుభవం కలిగేంత అవకాశం లేదు. అంత మాలిన్యం లేనటువంటి బుద్ధి నాకు లేదు. శుద్ధ బుద్ధి నా దగ్గర లేదు కాబట్టి ఒక్క వాక్యం చెప్పేస్తే దానిని అల్లేసుకుని, "ఉన్నది బ్రహ్మమే" అనే నిర్ణయాన్ని పొందేసి, ముక్తావస్థను చెందేటటువంటి ఉత్తమ సాధకులు అయివుంటే, వాళ్ళకు ఏం చెప్పారండీ? "ఉత్తమం తత్త్వ చింతాచ" – అంటే వారితో ఇక క్రింది స్థాయి మాటలు మాట్లాడరన్నమాట.

బాబూ! భోజనం చేశావా? మజ్జిగ తీయగా వుందా? మజ్జిగ పులుసు బాగుందా? ఇలాంటి విషయాలు అడగరన్నమాట. అలాగే, నువ్వు ఎప్పుడు ఏడిచావు? ఎప్పుడు ఏడవలేదు? నీకు ఎందుకు ఆవేశం వచ్చింది? ఎందుకు క్రోధం వచ్చింది? ఇలాంటి అంశాలు మాట్లాడరు వాళ్ళాతోటి. సూటిగా మాట్లాడుతారు. సరాసరి. ఇహ అక్కడ వ్యక్తి యొక్క జీవనానికి ఏమీ ప్రాధన్యత వుండదన్నమాట. వాళ్ళు 'తత్త్వచింతన'కి సరిపోతారు. సరే, "మధ్యమం మంత్ర చింతాచ" – లాభం లేదండీ! మీరు అక్కడక్కడా ఆకాశం అవతల చెబితే, ఒకేసారి అందుకోవడం వీలుకాదండీ నాకు. అలా సాధ్యపడడం లేదు. అన్నారు అనుకోండి. సరేలే బాబు. నీకు మనసు కొద్దిగా బలంగా వున్నదయ్యా! ఆ మనస్సు బలంగా వుంది కాబట్టి ఆ బలమైన మనస్సుని, నువ్వు రాజస్థానంలో కూర్చోపెట్టి నువ్వు సేవకుడిగా వున్నావు.

భగవంతుడు ఈ శరీరానికి అధిష్టానంగా నిన్ను పెట్టాడు.

నువ్వు ఏం చేశావు?

ఆ సింహాసనం ఖాళీ చేసి, మనస్సు అనే కుక్కను అందులో కూర్చోపెట్టి, దానికి నీవు సేవకుడిగా వున్నావు. కాబట్టి ఇప్పుడు ఏం చేయాలి?

కుక్కను కట్టి వేయాలి అంటే ఒక గొలుసుకావాలి.

కావాలి అంటే ఏం చేయాలి?

సంపాదించాలి. ఆ గొలుసే 'మంత్రం'.

"**మననాత్ త్రాయతే ఇతి మంత్రః**" మంత్రయోగం. నిరంతరాయంగా మంత్రజపం చేయడం. ఏమండీ! రోజుకి పది సార్లు చేయమంటారా? 108 సార్లు చేయమంటారా? లక్షసార్లు చేయమంటారా?

ఎంత బలమైన కుక్కని అక్కడ నువ్వు సింహాసనంలో కూర్చోబెడితే, అంత బలమైన దానిని కట్టి వేయడానికి, ఎంత బలమైన గొలుసుకావాలో, అంత గొలుసు సంపాదించుకో! నీ ఇష్టం. అది ఒక్కరోజులోనే సాధ్యపడవచ్చు. రెండు నిమిషాలలోనే సాధ్యపడవచ్చు. ఒక జీవనకాలము కూడా పట్టవచ్చు. కాబట్టి మనలో మనసు అనే ఆసక్తత ఎంత బలహీనంగా వుంటే, మంత్రయోగం అంత సులభం. సరే!

ఇక భక్తి విధానంలో మనం మాట్లాడుకునేటటువంటి అంశాలలో, ఇంకేమున్నాయి అండీ అని అంటే, (సమయం అయిపోయింది, ఓకే అందుకే ఇక రెండే అంశాలు చెబుతానండి)

అథమంచ – "ఉత్తమం తత్త్వ చింతాచ, మధ్యమం మంత్ర చింతాచ, అథమంచ" ఏంచేయాలండీ? 3వ category కి వచ్చేశాము. ఏం చేస్తే బాగుంటుంది? ఈ రెండూ చెయ్యలేము అనుకోండి, నిరంతరాయంగా మంత్రజపం చేయడం, శ్వాస ఆగిపోయే స్థాయి వరకూ మంత్రజపం చేయగలగడం, అది కూడా మనవల్ల కాలేదు, ఏం చెయ్యవచ్చు ఇప్పుడు? ఇంకేమి మిగిలి పోయిందండి మనం చేయడానికి? "తీర్థాటనం" – చేయవచ్చా? చేయకూడదా? చేయవచ్చు కదా! ఈ తీర్థాటనం ఏమిటయ్యా అని అంటే, క్రింది category లన్నమాట ఇవన్నీ! కాబట్టి మనం ఎప్పటికైనా సరే, కర్మ సిద్ధాంతాన్ని, కర్మ రహస్యాన్ని ఔపోసన పట్టాలి అని అంటే, మనం అందరం, తప్పని సరిగా, తత్వచింతన, నవవిధ భక్తి మార్గాలని, కర్తృత్వరహిత పద్ధతిగా చేసినట్లయితే, అప్పుడు మాత్రమే దీనిని తెలుసుకుని సాధించ గలిగే అవకాశం వుంది.

మీ అందరికి ఒక విజ్ఞప్తి. sadhakudu.blogspot.in అనే బ్లాగులో అనేక వేదాంత గ్రంథాలు, అనేకమైనటువంటి ఆడియోలు, అనేకమైనటువంటి వీడియోలు వున్నాయి, మహానుభావులు చెప్పినవి చాలా మందివి వున్నాయి. మీరు sadhakudu.blogspot.in అది బ్లాగు పేరు. అందరూ telugubhakthi.com చదువుతున్నవాళ్ళే కాబట్టి, computer తో మీరందరూ సుపరిచితులే.

sadhakudu.blogspot.in అందులో వున్నటువంటి అంశాలు, మీకందరికీ... open blog అది. ఎవరైనా చూడవచ్చు. అలాగే, Google groups లో కూడా, Sadhakudu Online Satsang అని ఒకటి వుంది. అది కూడా రోజువారీ, అనేకమైన పోస్టులు, అనేక మంది share చేస్తూ వుంటారు. అందులో కూడా మనం తెలుసుకోవచ్చు. telugubhakthi.com లో కూడా మా దగ్గర soft copy లో వున్నటువంటి అనేక వేదాంత గ్రంథాలని, ఇప్పుడు వారితో మాట్లాడాను, మేము already ఎప్పటి నుంచో, నేను చాలా సంవత్సరాలనుంచి subscribe అయ్యి వున్నాను, but ఎలా post చేయడం అన్నటువంటి అంశం, నేను ఇప్పటి వరకూ గోపీ కృష్ణగారిని కలవకపోవడం, తెలియకపోవడం వల్ల, అజ్ఞానం అంటే ఇలాగే వుంటుంది. ఎన్నో సంవత్సరాలనుంచీ పరిచయం వున్నాకూడా, ఫోను చేయలేకపోవడం, మాట్లాడ లేకపోవడం, కాలం అనుకూలించక పోవడం అంటే ఇదే! వేరే అంతకు మించి ఏమీ లేదు. ఎన్నోసార్లు ఇప్పటికి నేను, ఒక దశాబ్ధం నుంచి ఇదే ప్రాంతానికి వస్తూనే వున్నాను. కానీ ఆ పరిచయం కలుగలేదు, కానీ ఒక 'తపస్వి'ని మనం వారిలో చూడవచ్చు. అటువంటి మహద్భాగ్యం మనకు కలిగించినందుకు వారికి ధన్యవాదాలు తెలియజేస్తున్నాను. అందరికీ నమస్కారం.

(సౌజన్యం: అక్టోబర్ 2013 నందు "తెలుగుభక్తి.కమ్" వారు నిర్వహించిన సత్సంగము)

# కర్మ యోగము

సాధకుడు అనే వాడు సాధించవలసిన మొట్టమొదటి లక్ష్యము కర్మ అంటకుండా కర్మ చెయ్యగలుగుట. కర్మ అంటకుండా కర్మను చేయవలెనన్న నాలుగు జాగ్రత్తలు తీసికొన వలెను. ఈ నాలుగు జాగ్రత్తలు తీసికొని కర్మను ఆచరించిన యెడల అది కర్మయోగము అవుతుంది.

1.శాస్త్రనియమిత కర్మలనే చేయవలెను

2.ఫలాపేక్ష లేకుండా నిష్కామముగా కర్మను ఆచరించ వలెను

3.కర్మలను ఈశ్వరార్పిత బుద్ధితో చేయవలెను

4.కర్తృత్వ భావనను విడచి కర్మలను ఆచరించవలెను.

పైన చెప్పిన విధముగా జాగ్రత్తలు తీసికొని కర్మను ఆచరించిన చిత్తము పరిశుద్ధమవుతుంది. పరిశుద్ధ చిత్తమందు జ్ఞానము ఉదయిస్తుంది. జ్ఞానము ద్వారా మోక్షప్రాప్తి కలుగుతుంది.

ప్రతి ఒక్కరు అనుకూలముగా ఉన్నను లేకున్నను, నష్టమైనను, కష్టమైనను ధర్మబద్ధమైన, శాస్త్ర సమ్మతమైన రీతిలోనే కర్మలను ఆచరించవలెను.

కర్మను నిష్కామముగా చేయవలెనన్న కాంక్ష లేకుండా కర్మను ఆచరించవలెను. నేను కోరినది పొందకుండా నేను ఉండలేను అనునదియే కాంక్ష. చిత్తము నందు ప్రేరణ కలిగి ఒక ఆలోచన వచ్చినప్పుడు ప్రమాదమేమిలేదు. ఆ ఆలోచన యందు ద్రుష్టి నిలుపుట వలన సంగత్వము లేక ఆసక్తి కలుగు చున్నది. ఆసక్తి వలన పురుషుడు ఆ విషయాకార వృత్తిని పొందుచున్నాడు. అంటే కోరిక బలపడు చున్నది. కోరిక క్రోధమును కలుగచేస్తే, క్రోధము మోహమునకు దారి తీస్తుంది. మోహము వలన బుద్ధి నాశనమవుతుంది, వివేకమును కోల్పోతావు. కనుక విషయముల పట్ల ధ్యాస కలిగినప్పుడే జ్ఞానమును ఉపయోగించి పరిష్కరించు కోవాలి. మరియు చేసిన పనికి ప్రతిఫలమును ఆశింపకూడదు.

కాంక్షతో, ప్రతి ఫలము ఆశించి చేసిన కర్మ యందు గుణదోషములు ఉంటాయి. గుణములతో కూడి కర్మ చేయుట వలన సంగత్వ దోషము లేక ఆసక్తత కలుగుతుంది. కర్మను సంగత్వముతో చేయుట వలన చేసిన పనికి సంబంధించిన జ్ఞాపకములు చిత్తము నందు వాసనలుగా భద్రపరచబడతాయి. ఆ వాసనల నుండి మరల మరల కర్మప్రేరణలు కలుగుచూ ఉంటాయి. మరియు సంగత్వముతో కర్మ చేయుట వలన కర్మ ఫలములు మన ఖాతాలో జమ

చేయబడతాయి. ఆ కర్మ ఫలములను అనుభవించుటకు మరల మరల  శరీరములను ధరించవలసి వస్తుంది. జనన మరణ చక్రమునందు పరిభ్రమిస్తూ ఉంటాము.

కర్మ బంధము నుండి బయట పడవలెనన్న ఆసక్తతను పరిష్కరించుకొని కర్మను నిష్కామముగా ఆచిరించవలెను. నీవు  నిష్కామకర్మను ఆచరించుట వలన విషయాసక్తత నుండి బయట పడతావు. శాంతిని పొందుతావు.

ఆసక్తత ఉంటే కర్మ ఫలమును ఆశిస్తావు
కర్మ ఫలమును ఆశిస్తే  నిష్కామ కర్మ చెడిపోతుంది
నిష్కామ కర్మ చెడిపొతే అరిషడ్వర్గములు వస్తాయి లేక కలుగుతాయి.

విషయముల యెడల అనురాగము లేక ఆసక్తత  రెండు పద్దతులలో తొలగుతుంది

1. నిష్కామ కర్మ - కర్మ ఫలమును ఆశించ కుండా కర్మ చేయుట

2. అమనస్కము - కర్తయే లేని పద్దతిలో, మనస్సుతో పనిలేకుండా కర్మ చేయుట

ముందు కర్మ ఫలమును ఆశించ కుండా కర్మ చేయుట అలవాడాలి. తరువాత అమనస్కము.

నిష్కామకర్మను ఆచరించవలెనన్న ఈశ్వరార్పిత బుద్ధితో జీవించవలెను. కర్మ నియమము సృష్టి నియమము. కనుక సృష్టికి ఆధారము ఎవరో కర్మ నియమమునకు అతనే ఆధారము. ఆ ఈశ్వరుడే  ఇరుసు. కర్మను ఆచరించు నప్పుడు నీ హృదయము దైవీభావనతో నిండి ఆధ్యాత్మ చిత్తముగా ఉండవలెను. తద్వారా కర్మతో సంగత్వము తొలగిపోతుంది. కర్మ ఫలములను ఈశ్వరునికి అర్పించి దాని నుండి లభించే ఫలితము లాభదాయకమైనను, నష్టదాయకమైనను భగవత్ప్రాసాధముగా స్వీకరించవలెను. ఎపుడైతే ఈ విధముగా ఈశ్వరుని పట్టుకొని పని  చేయుట ప్రారంభించావో అప్పుడు  జ్ఞాపకములు (స్మృతి)  -> జ్ఞాపకముల నుండి ప్రేరణను పొందుట -> ఆ ప్రేరణ క్రియా రూపములో పెట్టుట -> ఫలమును పొందుట అను నాలిగింటిలో --  ఫలము నిర్వీర్యమవుతుంది. ఫలము నిర్వీర్యమవుట అంటే ఫలము స్మృతిలోనికి చేరి మరల ప్రేరణను ఇవ్వజాలదు. ఇలా  అసక్తత లేక సంగత్వ దోషము లేకుండా  ఫలమును ఈశ్వరునికి అర్పించుట ద్వారా ఫలమును నిర్వీర్యము చేయుటయే నిష్కామ కర్మ. జ్ఞానము, వైరాగ్యము తప్ప అన్యదా నాకు ఏమి అవసరము లేదు అని స్థిరముగా ఉండగలిగినప్పుడు  మాత్రమే నిష్కామ కర్మ సాధ్యమవుతుంది.

కర్మను ఈశ్వరార్పిత బుద్ధితో ఆచరించుట వలన

1.స్వార్థరాహిత్యము, తద్వారా చిత్తశుద్ధి కలుగుతుంది

2.భగవంతుని యందు భక్తి పెరిగి, భగవదనుగ్రహమునకు పాత్రులు అవుతాము

3.కర్మ ఫలములు మన ఖాతాలో జమచేయ బడవు కనుక కర్మ బంధము కలుగదు

కర్మను ఈశ్వరార్పణ భావంతో చేయకపోయిన సత్వ గుణం చెడిపోయింది. ఏ ఆలోచన అయినా ప్రసాద బుద్ధితో ఈశ్వరార్పణ భావంతో చేస్తే అందులో సత్వగుణం నిలబడుతుంది. నిస్వార్థ బుద్ధితో చేయక పోయిన రజోగుణం క్రియారూపంలోకి వస్తుంది. నిస్వార్థ పూరితంగా ఆలోచిస్తే రజోగుణం నిరసించబడింది. పరహితం లేనందు వల్ల తమోగుణ రూపంలోకి మారిపోతుంది . పరహితం కోరి చేస్తే తమోగుణము నిరసించబడుతుంది. ఈశ్వరార్పణ భావంతో, పరహితము కోరి కర్మలు చేయటం వల్ల మన: సంబంధమైన దోషాలన్నీ తొలిగిపోతాయి. లేనియెడల స్వార్థ పూరిత మైనటువంటి మనో సంబంధమైన దోషాలు మిగిలిపోతాయి.

నిష్కామకర్మను ఆచరించకుండా ఆధ్యాత్మిక మార్గములో అడుగులు ముందుకు పడవు. నీవు ఏ ఉపదేశము స్వీకరించాలి అన్నా, ఏ ఉపాసన చెయ్యవలెనన్న, ఏ సాధన చేయవలెనన్న కావలసిన ప్రాధమిక అర్హత నిష్కామకర్మాచరణ. నిష్కామ కర్మ(కర్మకు అతీతముగా ఉండి కర్మ చెయ్యగలుగుట) ద్వారా అంతరంగము శుద్ధి కాకుండా ఆధ్యాత్మిక సాధనలో పురోగతి ఉండదు.

నీవు దేనిని ఆచరణలో పెడుతున్నావో ఆ స్థాయికి సంబంధించిన విషములు ఏవి కూడా నీకు సందేహము ఉండకూడదు. జ్ఞానము స్థిరముగా ఉన్నప్పుడే ఆచరణ కూడా నిర్దుష్టముగా ఉంటుంది. నిష్కామకర్మ చెయ్యగలుగుచున్నావు అంటే అరిషడ్వర్గములచే బాధించబడకూడదు. ఏ అంశములో నీవు బాధించ బడుచున్నావో ఆ ఆ అంశములలో నీకు నిష్కామకర్మను చేయుట కుదరలేదు, ఆ ఆ అంశములలో ఫలముల పట్ల ఆసక్తి ఉన్నది అని అర్థము. ఇదే నిష్కామకర్మను ఎంతవరకు ఆచరణలోనికి వచ్చినదో పరీక్షించుకొనుటకు కొలమానము.

నిష్కామ కర్మ వలన భోక్త లేకుండా పోతాడు. కర్త లేకుండా చేసికొనవలెనన్న ఆత్మవిచారణను ఆశ్రయించవలెను.

మాయ వలన పంచభూతములతో 24 తత్వములతో కూడిన ఈ శరీరము ఏర్పడినది. దీని అంతటికి ఆధారముగా ఈశ్వరచైతన్యము ఉన్నది. విద్యుత్తు వంటి ఈశ్వర చైతన్యము వలన యంత్రముల వంటి ఈ శరీరము, ఇంద్రియములు పని చేయుచున్నవి. నీ ఉనికి ఎక్కడ ఉన్నది? మాయా స్వరుపములైన 24 తత్వములే నీవా? కాదు

కదా. అనంత సృష్టి ప్రవాహమునకు ఈశ్వరుడు కర్త. కనుక సృష్టి ప్రవాహములో భాగముగా చేయబడుచున్న సమస్త కర్మకు కర్త ఈశ్వరుడే. బుడగలు , నురుగు, నీరు అని సముద్రములో భాగములే కదా. అలాగే సమస్త జీవరాసులు అనంత సృష్టి ప్రవాహములో భాగములే. అనంత సృష్టి ప్రవాహమునకు కర్త అయిన ఈశ్వరుడే సృష్టి ప్రవాహములో భాగముగా చేయబడుచున్న సమస్త కర్మకు కర్త. ఆ అనంత సృష్టి ప్రవాహములో జరుపబడుచున్న కర్మలో భాగముగా ఈ శరీరము ద్వారా కర్మ జరుపబడుచున్నది, నేను కర్తను కాదు అన్న భావనతో జీవించు.

నీ ఇంటిలో మామిడికాయ పచ్చడి చేస్తున్నావు. నీవు చేసేటప్పుడే దాని యందు ఆనందమును అనుభవిస్తావు. అదే హోటల్ నందు పనిచేసే వారు కొన్ని వేల మామిడి కాయల పచ్చడి చేస్తారు. కాని తాదాత్మ్యత చెందరు. ఎందు వలన? ఏదైనా పని చేసేటప్పుడు నాకోసము చేస్తున్నాను అన్న భావనతో చేసిన ప్రేరణ కలిగి ప్రియము పనిచేస్తుంది. నేను కర్త అవుతున్నాడు. నాకోసము చేస్తున్నాను అన్న భావన లేకుండా నేను ఆత్మ స్వరూపుడను అన్న భావనతో చెయ్యి. కర్తృత్వము ఉండదు.

తాను ఏమి చేయుట లేదు, అంతా ఈశ్వరుడే ఈ ఇంద్రియ మనో బుద్ధుల ద్వారా జరిపించుచున్నాడు అన్న భావనతో జీవించిన కర్తృత్వభావన నుండి బయటపడతాము.

ఈ విధముగా నిష్కామకర్మను ఆచరించుట ద్వారా విషయాసక్తత నుండి, భోక్తృత్వ భావన నుండి బయటపడతాము. ఆత్మ విచారణ, ఆత్మ భావన ద్వారా కర్తృత్వ భావన నుండి బయట పడతాము. తద్వారా చిత్తము పరిశుద్ధమవుతుంది. పరిశుద్ధ చిత్తమందు జ్ఞానము ఉదయిస్తుంది. జ్ఞానము ద్వారా మోక్షప్రాప్తి కలుగుతుంది.

--- X ---

## <u>కర్మ ఫలములు</u>

జీవునకు ప్రాప్తించు కర్మ ఫలములు మూడు విధములుగా ఉండును

1.సంచితము 2.ప్రారబ్ధము 3.ఆగామి

**సంచితము** - జీవులు తమ పూర్వ జన్మలలో కూడబెట్టుకొనిన కర్మ ఫలములను సంచితము అంటారు

**ప్రారబ్ధము** - జీవుడు ఏ కర్మఫలములను అనుభవించబడు నిమిత్తము ఈ శరీరము ధరించాడో వాటిని ప్రారబ్ధము అంటారు

ప్రారబ్ధము మూడు విధములు

**ఇచ్ఛాప్రారబ్ధము** - మనము మనఃపూర్వకముగా కోరుట వలన ఇప్పుడు అనుభవమునకు వచ్చిన కర్మఫలములు

**అనిచ్ఛాప్రారబ్ధము** - తాము కోరకుండానే దైవికముగా ప్రాప్తించేవి

**పరేచ్ఛాప్రారబ్ధము** - ఇతరులు కోరుట వలన మనకు ప్రాప్తించిన కర్మఫలములు

**ఆగామి** - జీవులు ప్రారబ్ధమును అనుభవించే క్రమములో క్రొత్త కర్మలు చేస్తూ ఉంటారు. వాటిలో భాగముగా ఏర్పడిన క్రొత్త కర్మఫలములను ఆగామి అంటారు. భవిష్యత్తులో చేరే కర్మఫలములను ఆగామి కర్మలు అంటారు.

సంచితము భూతకాలము, ప్రారబ్ధము వర్తమానకాలము, ఆగామి భవిష్యత్తు

సంచితములో కొంత భాగము ప్రారబ్ధ కర్మగా వస్తుంది. దీనిని అనుభవవించే క్రమములో ఆగామి ఏర్పడుతుంది. దీనిలో మిగిలినది సంచితములో కలుస్తుంది.ఈ కర్మ సూత్రాన్ని అధ్యయనము చేసి, అర్థము చేసుకొని జ్ఞానముతో సంచితముతో సహా ఎవరైతే పోగొట్టుకొంటారో వాళ్ళు మోక్షాన్ని పొందుతారు.

ఫలితములను ఆశించకుండా కర్మలను ఆచరించుట వలన అరిషడ్వర్గములు నశించి చిత్తము పరిశుద్ధమగును. పరిశుద్ధమైన చిత్తము జ్ఞాన బోధకు సంసిద్ధమైనది. సద్గురువు ద్వారా జ్ఞానము కలుగును. జ్ఞానమును ఆచరణలో పెట్టి సాధన చేయగా చేయగా భగవదనుగ్రహము వలన జ్ఞానము అనుభవజ్ఞానముగా పరిణమించును. అట్టి స్థితిలో జ్ఞానాగ్ని వలన సంచితములోని సమస్త పుణ్య పాపకర్మలు నిశ్శేషముగా దగ్ధమైపోవును. పాప కర్మ ఫలములను పుణ్య కర్మలను ఆచరించుట వలన నశింపచేసికొన వచ్చును. కాని పుణ్య పాప కర్మలను సమూలముగా నశింప చేయగల శక్తి ఒక్క ఆత్మజ్ఞానమునకు మాత్రమే ఉన్నది.

ప్రా(ముందు) + ఆరబ్దము(వచ్చినది) - ప్రారబ్ధము అంటే పూర్వము నుండి వచ్చినది అని అర్ధము. గత జన్మ కర్మ ఫలితమును ఇపుడు మనము అనుభవిస్తున్నాము. చాలామంది ప్రస్తుతము మేము ఉన్న పరిస్థితికి కారణము నా ప్రారబ్ధము. అదే నన్ను ఈ విధముగా జీవించేటట్లు చేస్తున్నది అంటారు. కాని నీవు వర్తమానములో కర్మ చేసేటప్పుడు దానికి వ్యతిరేకమైన కర్మాచరణ చేయుట ద్వారా ఆ కర్మ ప్రభావమునుండి బయట పడవచ్చు. ప్రస్తుతం ధర్మ పద్ధతిలో ధర్మబద్ధమైన కర్మలు చేసి వాటి ప్రభావమును తగ్గించుకొనవచ్చును. ఉపాసనలు, ప్రార్ధనలు, పూజలు, శాస్త్రాధ్యయనము, తపస్సు, ధ్యానము వంటి వాటి వలన మనము గత కాలములో నిర్వర్తించిన కర్మల వలన కలిగిన ఫలిత ప్రభావమునకు లోనుకాకుండా తప్పించుకొని సక్రమమైన మార్గములో వెళ్ళేలా చేసికొనవచ్చును. గతించిన కాలం మన వశంలో లేదు. గత కాలంలో సరైన నిర్ణయము తీసుకొనక అనేక పాపకర్మలు చేసి ఉండవచ్చు. పాపము అంటే ఆత్మ ధర్మానికి వ్యతిరేఖముగా చేసేదంతా పాపమే. తిరిగి ఆత్మ ధర్మంలో నిలబడి జీవించి కర్మను అధిగమించిన స్థితిలో ఉండవచ్చు.

మనము ఈ శరీరము ధరించడానికి కారణమైన బలీయమైన సంస్కారములు మూడో , నాలుగో ఉంటాయి. అవే మన ప్రారబ్ధము. మిగిలిన సంస్కారములను కేవలము విచారణచే అధిగమించవచ్చు. కాని జన్మకు కారణమైన సంస్కారములను మాత్రము కేవలము ఆత్మజ్ఞానము చేతనే అధిగమించుటకు వీలగుతుంది. సంస్కారములు, వాసనలు ప్రాణ,మనో,బుద్ధులు అనే సూక్ష్మాన్ని ఆశ్రయించి ఉంటాయి. ఈ శరీరము ప్రాణ,మనో,బుద్ధులను ఆశ్రయించే పనిచేస్తుంది. కనుక మనము సరిచేయవలసినది అంతరంగమును, సూక్ష్మమును. అది కేవలము విచారణ ద్వారానే సాధ్యము. బుద్ధిని బుద్ధి చేతనే అధిగమించాలి. మన జీవన విధానము ఈ సంస్కార బలము మరింత బలపడే విధముగా ఉంటున్నది. విచారణ iద్వారా ఏవిధమైన జీవితమును జీవించిన ఈ సంస్కార బలము నుండి బయట పడతామో ఆ విధమైన జీవన విధానమును ఆశ్రయించాలి. అప్పుడు ప్రారబ్ధ ప్రభావమునకు లోబడక జీవించగలుగుతావు.

జీవితములో ఏవి మన వశమున ఉన్నవో అనగా ప్రయత్నముచే మార్పు చేసికొనుట అవకాశము ఉన్నదో వాటిని మార్పుచేసికోవాలి. ఏవైతే మన వశమున లేవో వాటిని ఎంతో ఓర్పుతో, అణకువతో అనుభవించి రద్దు చేసికొనవలసినదే. ప్రారబ్ధము విల్లు నుండి విడిచిన బాణం వంటిది. కాబట్టి వెనుకకు తీసుకోటం కుదరదు. శరీరము వచ్చేసింది కదా! వాటిని ఏం చేయగలం? అనుభవించి క్షయింపచేసుకోవాలి. 'నీవు' లేకుండా ఉంటే అవి క్షయం అవుతాయి. నీవుండి చేస్తే అవి ఎప్పటికి ఉంటాయి. అనుభవించేటపుడు నేను చేయటం లేదనే కర్తృత్వ భోక్తృత్వములు లేకుండా ఉండాలి, అప్పుడే అవి క్షయం అవుతాయి. లేకపోతే మిగుల్చుకొంటావు. వాటికి ఎదురు చెప్పకుండా మౌనంతో,సహనంతో, ధైర్యంతో అనుభవించవలసిందే. వాటిని ఎలా తప్పించుకోవాలి అని చూడకుండా, దానికి అన్య

కారణాలు వెతకకుండా, సర్వకారణ మీశ్వరం అని ఈశ్వర ప్రసాదంగా భావించి దానిని సంతోషంగా, సహనముతో, సాధనగా తరించడానికి మార్గంగా భావించి దివ్యమైన స్థితిలో అనుభవించడం నేర్చుకోవాలి. నేను అనే నామరూపాలు, జీవభావం స్థానంలో దైవాన్ని అక్కడ పెట్టుకొని, ఆ దైవీస్థితిలో ఉండి అనుభవించడము నేర్చుకోవాలి. మనం అనుభవిస్తున్న సుఖదుఃఖాలన్ని మనను భగవంతుడిలో చేర్చుకోవడానికి ఆయన మనకిస్తున్న అవకాశంగా చూడాలి. సాధనా మార్గంగా చూడాలి. సుఖదుఃఖాలకి ప్రభావితం కాకుండా చూసుకోవాలి. మనము బాధలననుభవిస్తున్నపుడు వాటిని నివారిచేందుకు వైద్యుడు ఇస్తున్న మాత్రల వంటివే ఈ దుఃఖానుభవమని తెలుసుకోవాలి. పాఠాన్ని ఈ రూపంలో తీసుకోవాలి. అప్పుడు నీ మీద ప్రారబ్ధ కర్మల వల్ల ఏర్పడే సుఖదుఃఖాల ప్రభావం లేకుండా ఉంటుంది.

ప్రారబ్ధమును ఓర్పుతో, అణకువతో అనుభవించాలంటే గుణాతీతంగా ఉండాలి. గుణాతీతంలో ఎప్పుడు నిలబడతారో అప్పుడు సాక్షివి అవుతావు. గుణత్రయానికి, అవస్థాత్రయానికి ఎవరైతే సాక్షిగా నిలబడిఉన్నారో వాళ్ళు ప్రారబ్ధమును సాధనగా మార్చుకొని జ్ఞానాన్ని పొందగలుగుతారు.

శరీర మనస్సులు నేను అన్న పరిమిత భావనను విడచి పెట్టి , నేను ఆత్మను అను భావనలో ఉండి కర్త లేని స్థితిలో కర్మను ఆచరించ వచ్చు. కర్తయే లేనపుడు కర్మ ఎవరిని ఆశ్రయిస్తుంది? కర్మయే లేనపుడు కర్మ ఫలము ఎలా ఉంటుంది? జ్ఞానము యొక్క ఫలము నీవు ప్రారబ్ధము చేత బాధించ బడకుండా ఉండే స్థితిలో ఉంచటమే. జీవించేటప్పుడు వచ్చిన దానిని కాదనక, పోవుచున్న దానిని వద్దనక, లేని దానిని కావాలనక సాక్షిగా జీవించటమే దీనికి పరిష్కారము. కర్మ జడము. దానికి ఉనికి లేదు. చైతన్య సహాయము ఉంటేనే సంస్కారములు పని చేస్తున్నాయి, మనస్సు రూపమును దృశ్యముగా చూపిస్తున్నది, ఇంద్రియములు పనిచేయు చున్నవి. అదే చైతన్య సహాయముతో ఈశ్వరుని చూడు. అప్పుడు ప్రారబ్ధము చేత బాధించబడని స్థితిలో ఉండగలుగుతావు. నీవు ఆత్మ ధర్మంలో నిలబడి ఉండి ఈ సాధనాలన్నీ చేసినట్లయితే స్వస్వరూపజ్ఞానము వస్తుంది. స్వస్వరూపజ్ఞాన ప్రభావం వలన ఆ కర్మ ప్రభావం నీ మీద పడకుండా ఉంటావు.

జ్ఞానమార్గం ద్వారా భవిష్యత్తులో జరిగే కర్మఫలములకు దూరంగా ఉండాలి, గతములో మనం కూడబెట్టుకొన్న కర్మఫలము నుండి (సంచితము నుండి) పరిపక్వత పొందిన కర్మ ఫలములు అంటే ఈ జన్మలో అనుభవించడానికి సిద్ధంగా ఉన్న కర్మ ఫలములు ప్రారబ్ధకర్మలు అవుతాయి. ప్రారబ్ధమును అనుభవించే క్రమములో భవిష్యత్తులో మన ఖాతాలోనికి చేరే కర్మఫలములను ఆగామి కర్మలు అంటారు. శాస్త్రాధ్యయనము చేయటము వలన నిరంతర ధ్యానాభ్యాసము వలన జ్ఞానమును పొంది అహంకారభావమును పూర్తిగా లయం చేస్తే జీవితములో మనకు కలుగు

సుఖదుఃఖానుభవమునకు అసంగంగా, సాక్షీభావముతో ఉండటము సాధ్యపడుతుంది. సాక్షి భావనతో జీవించుట ద్వారా ఆగామి కర్మను పోగొట్టుకోవచ్చును.

"నేను, నేను" అనేదాన్ని నిరసించడం నేర్చుకోవాలి. నేను సాక్షిని, నేను సాక్షిని, అని నిలబడి ఉండి, ఎన్ని వచ్చినా అన్నింటిని నిరసిస్తూ వచ్చేస్తే కేవల సాక్షి చివరకు మిగులుతుంది. ఆ కేవల సాక్షే బ్రహ్మము అని తెలుస్తుంది. బ్రహ్మమనే స్థితిలో నిలబడి ఉన్నపుడే ఇవన్నీ నిరసించడానికి వీలు అవుతుంది. ఈ ఆత్మ జ్ఞానము వలన నేను చేస్తున్నాను, నేను అనుభవిస్తున్నాను అను భావములు తొలగిపోతాయి. నేను భావించేవాడిని, నేను ఆలోచించేవాడిని అనే జీవ భావం అంతా తొలగిపోతుంది. కర్తృత్వ భోక్తృత్వాలను నిరసించాలి. నేను సాక్షిని అనేటప్పటికి ఈ ఆలోచనలు, భావాలు లేకుండా పోతాయి. దీని పర్యవసానముగా నీవు జీవ భావము లేక అసంగంగా ఉండుట సంభవిస్తుంది. కాబట్టి సాక్షీ సాధన ద్వారా ఆగామి కర్మను పోగొట్టుకోవచ్చు.

ప్రారబ్ధము భోగముతో నశిస్తుంది. సాక్షిత్వముతో అకర్తగా ఉండి అనుభవిస్తే ప్రారబ్ధము క్షయము అవుతుంది.

ఆగామి కర్మ నిత్యవర్తమానములో, నిష్కామ కర్మతో, ఈశ్వరార్పణ భావముతో జీవించుట ద్వారా ఏర్పడకుండా ఉంటుంది.

సంచితము బ్రహ్మజ్ఞానముతో పరబ్రహ్మ నిర్ణయాన్ని పొంది తనువు లేని వానిగా వున్నప్పుడు మాత్రమే రద్దు

పై విధముగా జీవించుట వలన మూడు కర్మలు నశించిన మోక్షము కలుగును.

--- X ---

# కర్మ

కర్మ అను పదమును క్రియకు  కారణమైన ప్రేరణను సూచించుటకు మరియు కర్మ ఫలములను సూచించుటకు ఉపయోగిస్తారు. కర్మ చేతనే ఈ జీవ సృష్టి అంతా నడపించ బడుచున్నది. కర్మ నియమము సృష్టి నియమము. దానిని అవగాహన చేసికొని ఆ సృష్టి  నియమానుసారము జీవించగలిగిన మన జీవితము సుఖమయము అవుతుంది. బ్రహ్మ జ్ఞానమును అధ్యయనము చేయుటకు అర్హత కలుగుతుంది. బ్రహ్మజ్ఞానముతో జీవించుట ద్వారా కర్మను అధిగమించి కర్మకు అతీతముగా జీవించగలుగుతాము.

నేను కర్త. పని చెయ్యటము క్రియ. "నేను" పని చెయ్యటానికి స్మృతిని, ఇంద్రియములను ఉపయోగించు కొంటున్నాడు. "నేను" ఇంతకమునుపు చేసిన క్రియల యొక్క అనుభవములు, లక్షణములు స్మృతిలో జ్ఞాపక రూపములోఉంటున్నాయి. తగిన సమయమునందు స్మృతిలోనివి  ప్రేరణ పొందుట వలన క్రియారూపము లోనికి వస్తున్నాయి. స్మృతిలోనివి  క్రియారూపము లోనికి రావటానికి కారణమైన  ప్రేరణయే కర్మ.

ఉదాహరణ : నేను హాస్పిటల్ కు వెళ్లి పరీక్ష చేయించుకోవాలి అనుకొన్నాను. ఇది స్మృతిలో జ్ఞాపక  రూపములో ఉన్నది. అది ప్రేరణ పొందినప్పుడు (కర్మ) ఫలానా వైద్యుని దగ్గరకు వెళ్ళాలి అని నిర్ణయించుకొన్నాను. ఆ వైద్యుని దగ్గరకు వెళ్ళాను. అది క్రియ.  ఆ వైద్యుడు పరీక్షించి నిర్ణయము తెలిపారు. అది ఫలము. ఇదంతా చేస్తున్న నేను అనే కర్త ఉన్నాడు. ఇదే క్రమములో మన జీవితము అంతా నడుస్తున్నది.

కర్మను అధ్యయనము చేయునది

కర్మ ఫలముచే బాధించబడని స్థితియందు నిలచుట ఎటులనో తెలసికొనుటకు

ప్రేరణ స్థితిలో కర్మ క్రియారూపము ధరించకుండా నిలుపు విధానమును తెలసికొనుటకు

చివరగా కర్తలేని కర్మాచరణ లేక కర్తృత్వరహిత కర్మను ఏవిధముగా చేయవలెనో తెలసికొనుటకు

కర్మ ప్రేరణ క్రియా రూపము ధరించుట, ఆసక్తితో కూడి చేసిన  క్రియ యొక్క ఫలము జ్ఞాపకముగా స్మృతిలో ముద్రితము అగుట, ఆ స్మృతిలోని జ్ఞాపకము అనుకూల వాతావరణము లభించినప్పుడు మరల ప్రేరణ పొంది క్రియా రూపము ధరించుట జరుగుచున్నది.  స్మృతిలోని జ్ఞాపకములనే వాసనలు అంటారు. ఈ శరీరము విడచి పెట్టబడునప్పటికి ఏవైతే వాసనలు మిగిలిపోయినవో వాటిని తీర్చుకొనుటకు మరల క్రొత్త శరీరము ధరించబడుచున్నది. ఈ విధముగా జనన మరణ చక్రములో జీవులు పరిభ్రమించుచున్నారు.

జనన మరణ చక్రము నుండి బయట పడవలెననిన, కర్మ నుండి విడుదల పొందవలెననిన మొదట కర్మ ఫలములచే బాధించబడని స్థితియందు ఉండవలెను. అది నిష్కామకర్మను ఆచరించుట ద్వారా సాధ్యము అవుతుంది. కర్మఫలము లభించిన తరువాత దాని గురించి చింతించుట ఉపయోగము ఏమి ఉండదు. అలా చేయుట వలన స్మృతిలో జ్ఞాపకముగా నిలుస్తుంది. దీని నుండి బయట పడవలెననిన కర్మ ఫలమును దైవనిర్ణయముగా భావించి సామాన్యముగా స్వీకరించి జీవించుట అలవరచుకోవాలి.

ఉదాహరణకు నేను హాస్పిటల్ కు వెళ్లి పరీక్ష చేయించుకోవాలి అనుకొన్నావు. వైద్యుని దగ్గరకు వెళ్ళావు. ఆ వైద్యుడు పరీక్షించి నిర్ణయము తెలిపారు. ఫలము వచ్చిన తరువాత నేను హాస్పిటల్ కు ఎందుకు వెళ్ళాను? ఆ వైద్యుడు పరీక్షించి నిర్ణయము ఎందుకు తెలిపాడు అని విచారించుట వలన ఉపయోగము లేదు. ఆ వైద్యుని నిర్ణయమును మామూలుగా స్వీకరించిన అది సామాన్యమవుతుంది. ఆ వైద్యుని నిర్ణయమును పదే పదే స్మరించుట వలన అది విశేషమై అది నీ స్మృతిలో బలపడుతుంది. అంటే అహంకారము బలపడుతుంది. అది మరల ఇంకొక పనికి ప్రేరణ అవుతుంది. ఈ విధముగా కర్మచక్రము కొనసాగించబడుతుంది. దానికి బదులుగా ఫలమును దైవనిర్ణయముగా భావించి స్వీకరించిన అంతటితో ముగిసిపోతుంది. దానికి సంబంధించిన జ్ఞాపకములు బలీయముగా ముద్రించబడవు.

కర్మ నియమము సృష్టి నియమము. కనుక సృష్టికి ఆధారము ఎవరో కర్మ నియమమునకు అతనే ఆధారము. ఆ ఈశ్వరుడే ఇరుసు. ఎప్పుడైతే ఈశ్వరుని పట్టుకొని పని చేయుట ప్రారంభించావో అప్పుడు స్మృతి, ప్రేరణ , క్రియ , ఫలములలో -- ఫలము నిర్వీర్యమవుతుంది. ఫలము నిర్వీర్యమవుట అంటే ఫలము స్మృతిలోనికి చేరి మరల ప్రేరణను ఇవ్వజాలదు. ఇలా ఆసక్తత లేక సంగత్వ దోషము లేకుండా ఫలమును ఈశ్వరునికి అర్పించుట ద్వారా ఫలమును నిర్వీర్యము చేయుటయే నిష్కామ కర్మ. నిష్కామ కర్మ వలన భోక్త లేకుండా పోతాడు.

ఆసక్తితో కూడి చేసిన కర్మఫలములు అరిషడ్వర్గములుగా స్మృతిలో నిలుస్తున్నవి. మరల ప్రేరణను ఇచ్చేటప్పుడు కూడా అరిషడ్వర్గ రూపములోనే ప్రేరణ నిస్తున్నాయి. ఆ అరిషడ్వర్గములే క్రియారూపములోనికి వస్తున్నాయి. మరల అవే కర్మ ఫలములుగా వస్తున్నాయి. కనుక స్మృతి రూపములో ఉన్న విత్తనమే ఫల రూపములో వృక్షముగా కనపడుచున్నది. విత్తన రూపములోనుండి వృక్షముగా పరిణామము చెందించేది కర్మ. ఇదే కర్మ బంధము అంటే. ఈ కర్మబంధమును కొనసాగనివ్వకూడదు అంటే ఏ స్థితిలో దానిని నిలపాలి? స్మృతి పరిధిలోన? కర్మ ప్రేరణ స్థితిలోన? క్రియారూపము ధరించే స్థితిలోన లేక ఫలము స్మృతిగా మార్పు చెందనివ్వకుండా చేయుట వలనా? ఏ పరిణామము కలగాలన్నా ఒక ఆధారము ఉండాలి, దానిని ఆసరాగా చేసుకొని పనిచేసే శక్తి ఉండాలి. స్మృతి నుండి ప్రేరణ కలగాలన్నా, ప్రేరణ క్రియగా మారాలన్నా, క్రియ ఫలమును ఇవ్వాలన్నా నీలో ప్రాణశక్తి సహాయము ఉండాలి. ఎప్పుడైతే

స్మృతి నుండి ప్రేరణ కలుగు చున్నదో అప్పుడు నీ ప్రాణాన్ని స్వాధీనము చేసికోవాలి. నీ శ్వాస ఎప్పుడైతే స్మృతి నుండి ప్రేరణ కలుగు చున్నదో అప్పుడు ఎడమ నుండి కుడికి, కుడి నుండి ఎడమకు తిరగదు. వెంటనే గుర్తించి ప్రేరణ నుండి పనిలోనికి వచ్చేలోపు మరల శ్వాసను సరిచేసుకొనిన ప్రేరణ క్రియా రూపము ధరించక మరల స్మృతిలోనికి వెళ్ళిపోతుంది. ప్రాణశక్తిని స్వాధీన పరచుకొని ప్రేరణ, క్రియా రూపములోనికి రానివ్వకుండా చేయుట వలన కేవలము సామాన్యమైన పనులు మాత్రమే జరుగు చున్నవి. విశేషమైనవి లేక ప్రత్యేకమైనవి అన్ని ఆగిపోవుచున్నవి.

ప్రాణశక్తి స్వాధీనమగుట వలన ప్రేరణ, క్రియా రూపములోనికి రావటము లేదు. విశేషములు స్మృతి పరిధిలోనే ఆగిపోవుచున్నవి. క్రియారూపములోనికి వచ్చిన సామాన్యమైన పనుల ఫలమును ఈశ్వరునికి అర్పించుట వలన కొత్త కర్మలు(ప్రేరణలు) ఏర్పడుట లేదు. కాని స్మృతిలో కర్త ఉన్నాడు. పై విధముగా జీవించుట వలన చైతన్యశక్తి స్మృతి దగ్గర ఆగిపోవు చున్నది. ఆ స్మృతిలో ఉన్న విత్తనములను కూడా నిర్వీర్యము చేయవలెనన్న ఆత్మ విచారణ చెయ్యాలి.నిష్కామ కర్మ ద్వారా ఫలములోని విత్తనములను, ఆత్మ విచారణ ద్వారా స్మృతిలోని విత్తనములను నిర్వీర్యము చేయవలెను.

అనుభవ క్షేత్రంతో సంపర్కం కలిగినప్పుడు కర్మ ఏర్పడుతుంది. సంపర్కం అంటే కలవడం. నేను ఆత్మస్వరూపుడను అనుభావన నుండి దిగివచ్చి మనస్సుతో తాదాత్మ్యత చెందుట వలన కర్మ ఏర్పడుతుంది. మనస్సుతో కలవకుండావుంటే నీకే కర్మ లేదు. గాఢ నిద్రావస్థలో మనస్సుతో కలవట లేదు కనుక ఏ కర్మాలేదు. మెలకువలో అనుభవ క్షేత్రమైన మనస్సుతో కలసిపోతున్నావు కనుక కర్మ ప్రభావం ఏర్పడి కర్మఫలం తయారవుతుంది. నీవు ఆలోచన కంటే భిన్నమైన వాడివి, అతీతమైన వాడివి. నీ ప్రభావం వలన ఆలోచన కలుగుచున్నది కాని మనస్సుకి స్వతఃసిద్ధంగా ఆలోచించగల శక్తి లేదు. అది జడం. నువ్వు క్షేత్రజ్ఞుడివి, చైతన్యానివి. సూర్యరశ్మి చేత చంద్రుడు ప్రకాశిస్తున్నట్లు, మనస్సు నీ సంపర్కం వల్ల పని చేస్తున్నది. కాబట్టి నువ్వు మనస్సు కంటే అతీతంగా, అధిష్టానంగా , సాక్షిగా వున్నట్లయితే మెలుకువలో కూడా కర్మ ఏర్పడదు.

ఆధారాన్ని గట్టిగా పట్టుకోవాలి. అభ్యాస బలం చేత నేను చైతన్యాన్ని అని ఆధారాన్ని గట్టిగా పట్టుకోవాలి. నామ రూపాల్ని పట్టుకొంటే ఈ సూక్ష్మ విచారణ రాదు. బాగుంది, బాగలేదు తోచినప్పు డెల్లా నేను చైతన్యాన్ని కదా! నాకు ఏమీ లేవు కదా అని స్థిరపడడం రావాలి. అప్పుడు మాత్రమే విషయపరిజ్ఞానాన్ని కాదని, కర్మకు సాక్షిగా వుండగలిగేటటువంటి సూక్ష్మ పరిజ్ఞానం వస్తుంది. బుద్ధిని చైతన్యంలో పెట్టాలి, ఇంద్రియాలు సామాన్యంగా పనిచేయాలి. బాగుంది, బాగులేదు,సుఖము, దుఃఖం అనే గుర్తింపు లేకుండా ఉండగలుగుతావు. అప్పుడు విషయాలను గుర్తించవు,

ఒక వేళ గుర్తించినా బుద్ధి అవసరం లేదు అని చెబుతుంది. అవసరం వుంది అంటే మనసు వస్తుంది, జ్ఞాపకములు, కర్మ ఏర్పడతాయి.

ఏ విషయమునకు, జ్ఞాపకమునకు ప్రతిస్పందన వుండకూడదు. స్పందిస్తే కర్మ ఫలం వస్తుంది. గుర్తించకుండా వుంటే కర్మ ఏర్పడదు.

సూర్యుని వలే జీవించు, అప్పుడు సాక్షిగా ఉండగలుగుతావు. సాక్షిగా ఉన్నవానికి ఇంద్రియములు శమిస్తాయి ఇంద్రియములు శమిస్తే కర్మ నిన్ను వదిలివేస్తుంది. నువ్వు దేనినైన విడచుట కాదు అదే నిన్ను విడచే విధముగా నీ జీవనవిధానము ఉండాలి.

--- X ---